# అమృత నేత్రాలు

[ కవితా సంపుటి ]

ఆచార్య తిరుమల
చైతన్య కళాశాల
హైదరాబాదు–1.

ప్రచురణ :
విప్ల పబ్లికేషన్స్
హైదరాబాదు–౨౦.

AMRUTHA NETRALU

By : ACHARYA TIRUMALA

Copies : 500

First Edition : 1987

Cover Design : S. T. V. Seshu ( Hyderabad )

Price : Rs. 20/-

For Copies : ACHARYA TIRUMALA
Chaithanya Kalasala
Sultan Bazar, Hyderabad-20.
Phone : 557589.

OR

VIPLA PUBLICATIONS
1-1-258/20/6, Muncipal Market lane,
Chikkadpally, Hyderabad-29.
Phone : 66242.

Printed at : VIPLA PRINTERS
Chikkadpally, Hyderabad-20.
Phone : 66242.

# BIO-DATA

ACHARYA TIRUMALA.

Born at Rajahmundry in 1945., brought up and educated at Pentapadu, Eluru & Visakhapatnam.

Working as Head, Telugu Department in Chaithanya Kalasala, Sultan Bazar, Hyderabad. ( A. P. )

Author of 25 books which include Poetry, Drama, Lyrics, stories and literary Citicism:

Awards : 1) Winner of "Devulapalli Krishna Sastry Award" for his poetic work "HRUDAYA BHARATHI"

2) Winner of 'Kundurthi Memorial Award" for his poetic work "Cheekati Merupulu".

3) Winner of Mrs. Veni Mahadev's cash Award (116/-) Berkeley - U.S.A.

4) "Recognition Awards" from New York, U.S.A.

5) Jyothirmayee Award (Madras) for his Poetic work "AKSHARAAGNI".

Titles : Kali Kousthubha
Sahithi Swarat
Madhura Bharathi (from Chicago - U.S.A.)
And tributes from well-known poets, critics & artists.

Founder President : Chaithanya Kalasala.

Advisor : Several cultural bodies and Associations in Andhra Pradesh State.

Visited : Thailand, Malaysia, Singapore in 1983 and U.S.A. in 1985 respresenting the Telugu poets as a special invitee.
And Selected as National Poet for 1986.

*—Publishers*

# మా మాట

ఆధునిక తెలుగు సాహిత్యంలో పేరుకెక్కిన కవి పండితుల్లో ఆచార్య తిరుమల గారు ఒకరు. ఆయన సహృదయ విమర్శకులు, చక్కని వక్త. ఆయన ప్రోత్సాహంతో చాలామంది యువ కళాకారులు, యువ కవులు, రచయితలు, కవయిత్రులు– వెలుగులోకి వచ్చి లోకానికి అక్షర దీపాలు అర్పిస్తున్నారు. శ్రీ తిరుమల గారి ఆత్మీయతతో, ప్రోత్సాహంతో 1986లో మేం మా ప్రచురణ విభాగం మొదలుపెట్టాం. తిరుమలగారి అభిమానుల్ని దృష్టిలో పెట్టుకుని, ఆయన మీది గౌరవంతో ఆయన రచించిన 'కవి దర్శనం' వ్యాస సంపుటితోనే మా ప్రచురణ విభాగం మొదలుపెట్టాం. తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నంచేసే రచనల్ని వెలుగులోకి తెచ్చి ప్రోత్సహించాలనే ఉద్దేశం మాది. ఈ 'అమృత నేత్రాలు' మా రెండో ప్రచురణ. కవిదర్శనానికి లభించిన ప్రోత్సాహమే ఈ ముందడుగుకు కారణం. తిరుమల గారికి మా అభినందనలు - కృతజ్ఞతలు.

**ఎం. విజయసేనారెడ్డి,** ఎం. ఎస్సి.
విప్లవ పబ్లికేషన్స్.

# అంకితం



సహృదయ శేఖరులు

**శ్రీ సి. జగన్మోహనరెడ్డి గారికి**

# స్వాభిరుచి

ఏడాది కొక పుస్తకం అచ్చయి, ఆర్యజన సమక్షంలో ఆవిష్కరింప బడుతూ వుంది. అదృష్టంగా భావిస్తున్నాను. ఈ ఏటికి ఈ 'అమృత నేత్రాలు'. ఇందుకు ప్రధానంగా విప్ల ప్రింటర్స్ అధినేత శ్రీ విజయసేనారెడ్డి, ప్రముఖంగా శ్రీ జగన్మోహనరెడ్డి కారణభూతులు.

ఈ సంపుటిలోని కవితలు- భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్ర భూమి, ఆంధ్రజ్యోతి. శ్రీవాణి, జగతి మొదలైన ప్రముఖ పత్రికల్లో ప్రచురించ బడ్డాయి. అమెరికా వెళ్ళినప్పుడు లాస్ ఏంజెలెస్ ప్రారంభ సభలో చదివిన ప్రత్యేక కవిత, న్యూ ఢిల్లీలో జాతీయ కవి సమ్మేళనంలో చదివిన కవిత- తెలుగువారు ఎప్పుడు విన్నా పరవశించే 'తెలుగుతేనె' కవిత- కూడా యిందులో చేర్చాను.

సామాజికాభ్యుదయ ప్రయోజన సృష్టిని, అంతర్గత తాత్త్విక దృష్టిని ఈ రచనలో గుర్తించుమని వినయసూచన !

నిజమైన కవిత్వం భౌతిక చిత్రలేఖనానికి అందదు. నా ప్రియతమ సోదరుడు ఎస్. టి. వి. శేషు ముఖచిత్ర రచనకి ప్రయత్నించాడు.

నా అక్షరానికి, అడుగుకి మరుపు, వెరపు లేవు. నేను సాధించే వెలుగు నా అభిమాను లందరికీ చెందుతుంది. నా సర్వ ప్రయత్నాల సారం- అమృత నేత్రాలకే అందుతుంది. ఎవర్ని మరిచిపోగలను ?

-ఆచార్య తిరుమల

# నేత్ర ప్రభలు

# సమైక్య దర్శనం

[ 1986 రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా కొత్తఢిల్లీలో ఏర్పాటైన 'జాతీయ కవి సమ్మేళనం' లో చదివిన కవిత ]

మూడు అక్షరాలు కలిస్తే ప్రణవం
మూడు రంగులు కలిస్తే పతాకం!
జాతి ఒక రసాత్మక వాక్యం
దేశం ఒక నిఘంటువు!

కొన్ని ధ్వనులు కలిస్తే అక్షరం
కొన్ని అక్షరాలు కలిస్తే పదం
కొన్ని పదాలు కలిస్తే వాక్యం!
జాతి ఒక రసాత్మక వాక్యం!

దాని అర్థం - పరమార్థం జాతీయత !
మానవత ! విశ్వజనీనత !

దేశం ఒక నిఘంటువు !

నిఘంటువులో ప్రతి పదానికి
అర్థం దొరుకుతుంది -
దేశంలో ప్రతి వ్యక్తి ఒక పదం
అర్థవంతమైన పదం !

దేశం ఒక నిఘంటువు !

సందర్భాన్ని బట్టి ప్రయోగించటంలో
పదానికి శక్తి పుడుతుంది -
జాతీయ దృక్పథానికి వినియోగించటంలో
వ్యక్తి శక్తికి మహత్తు పుడుతుంది -

నిఘంటువు వాక్యం కాదు,
వాక్యానికి నిఘంటువు కావాలి !

నిఘంటువులో
కొందరు జాతి రత్నాల్లాంటి పదాల్ని
ఎన్నుకొని ఆనందిస్తూ ఉంటే -
మరికొందరు నత్తగుల్లల్లాంటి అశ్లీల పదాల్ని తడిమి
వినోదిస్తూ వుంటారు !
పాపం ! నిఘంటువుదేం తప్పు !
అది పదాల పిల్లల తల్లి !
దాని కడుపు తీపి
కలం ధారులకి తప్ప
ఖడ్గధారులకి తెలియదు !

భేదం — దృశ్యానిది కాదు, దృష్టిది !
వ్యక్తిది కాదు, సృష్టిది !

పదం లాంటి వ్యక్తిని
పరీక్షించి చూడు !
రెండు కళ్లు, రెండు చెవులు
రెండు ముక్కు పుటలు –
రెండు చేతులు, రెండు కాళ్లు –
ఈ జంటల్లోంచి —
ఒక చూపు ఒక వినికిడి –
ఒక వూపిరి ఒక క్రియ — ఒక గమనం !

మరి — !
ఒక తల !
ఒక హృదయం !
ఒక ఉదరం !
కానీ వేలాది ఆలోచనలు
లక్షలాది స్పందనలు
ఆనంతకోటి జ్వాలలు !

[illegible]కి ఒకే ఒక నోరు !
ఒకే ఒక నాలుక !
నాలుక – ఐతే ఏలిక లేకపోతే జ్వాలిక

వాక్యానికి పనికిరాని పదం ఎందుకు ?
జాతీయతా భావం లేని వ్యక్తి ఎందుకు ?

పొరలు పొరల్లో వున్నా
దానిమ్మ పండులోని గింజల్లా
దేశ సంస్కృతిలోని వ్యక్తి భావాలు
చవులూరించకపోతే ఎలా !

చరిత్రల — త్యాగాల వేదికల వెలుగుమీద
ఎగురుతున్న పతాకం
కేవలం మూడు రంగుల గుడ్డకాదు,
పదాల ప్రణవనాదాల వెన్నెల గడ్డ!

కలయికలోనే
శక్తి — అనురక్తి — అంధకారం నుండి విముక్తి!

ఉదరం నుండి హృదయానికి రా!
దేశ సౌభాగ్యం కోసం స్పందించు!
విహంగ వీక్షణం నుండి
విహాయస వీక్షణానికి రా!
నీ యింటి నుండి నీ దేశాన్ని వీక్షించు!

నాణానికి బొమ్మా — బొరుసు వున్నా
అంచు ఒకటే!
దేశానికి నేనూ —నీవూ వున్నా,
'మన' అన్న దొకే అంచు!
మంచినే నలుగురికి పంచు!
ప్రణవాన్ని
పతాకాన్ని
కోరుకో!
ప్రగతి తీరాన్ని చేరుకో!

Government of India
All India Radio : Hyderabad.

National Symposium of Poets - 1986
English Translation of Selected Telugu Poem

# THE VISION OF UNITY

Three sounds unite
the result is AUM
Three colours unite
the nation gets its flag

The nation is a profound sentence
The country is a lexicon

A sequence of sounds makes a syllable
A String of syllables makes a word
A string of words makes a sentence

The nation is a profound sentence

Its meaning, the ultimate meaning
Is nationalism, humanism, universalism

The country is a lexicon
The lexicon lists every word and its meaning
There is a word for everyone, a meaningful one
The nation is a lexicon.

The word derives its force
from the context
A person becomes more effective
when he works for the country

The lexicon does not make a sentence
Sentences make lexicons.

Some select precious words, cheerfully
Others select obscene words; gleefully

What a pity ! The lexicon is not to blame
The words are all its children

Only the penman,
and not the swordman knows
a mother's love for her child.

The scene is not to blame,
only the seer.
The person is not to blame
only the composition.

Look carefully,
a person is like a word
Two ears, two eyes
Two nostrils, two hands, two feet
But a single hearing, a single seeing
One breathing, one act, one move

But, a million thoughts
a billion responses
a trillion flashes
one head,
one heart,
one belly,
all served by one mouth !
One tongue
one tongue for triumph and tragedy

Who needs a word
that cannot fit into any sentence ?
Who needs a person
that is not a patriot ?

Like the ripened seeds
of the pomogranate
each housed in its own
and yet tempting us with its taste
a person should enrich the nation.

Our flag is not just a three-shaded rag
It is a symbol of our history,
of the sacrifice of our patriots
a symbol of messages,
in the language of the spirit
It is our beacon.

Unity is strenth
Unity is Love
Unity is Enlightenment.

Proced from the belly to the heart
Yearn for the prosperity of the nation

Switch over from a bird's eye view
to a sky-view
Swifch your attention from your little house
to your great country

The coin may have a head and a tail
    but only one edge

'You' and 'I' may be distinct
but we have a Common border

Be Good
Yearn for the spirt, for our flag
and reach the shores of progress.



GOVERNMENT OF INDIA
ALL INDIA RADIO HYDERABAD.

NATIONAL SYMPOSIUM OF POETS 1986
HINDI TRANSLATION OF SELECTED TELUGU POEM

# एकता के दर्शन

—आचार्य तिरुमला

तीन अक्षर मिले तो प्रणव
तीन रंग मिले तो पताका
जाति है एक रसात्मक वाक्य
देश है एक शब्द कोश ।

कुछ ध्वनियां मिले तो बनता अक्षर
कुछ अक्षर मिले तो बनता शब्द
कुछ शब्द मिले तो बनता है वाक्य
जाति है एक रसात्मक वाक्य ।

उसका अर्थ है : परमार्थ है
जातीयता, मानवता और विश्वजनीयता ।

देश एक शब्दकोष है
शब्द कोश में प्रति शब्द के लिए अर्थ मिलता है
देश का प्रत्येक व्यक्ति, व्यक्ति एक शब्द है, अर्थवान शब्द
देश एक शब्दकोष है ।

प्रसंग के अनुकूल प्रयोग करने से शब्द में शक्ति पैदा होती है
राष्ट्रीय दृष्टिकोण से विनियोग करने में
व्यक्ति की शक्ति में महत्व पैदा होती है।

शब्दकोष वाक्य नहीं होता
वाक्य के लिए शब्दकोष चाहिए।
शब्दकोष से कुछ लोग निखरे हीरे जैसे शब्दों को चुनकर
आनन्दित होते रहते हैं।

और कुछ लोग थोथो जैसे अश्लील पदों को लेकर प्रमुदित होते हैं
इसमें बेचारे शब्दकोष का क्या दोष,
वह है शब्द रूपी संतान की माता
उसके माधुरी का पता स्वप्न धारियों के सिवा
अडगधारियों को मालुम नहीं पडता।

दृश्य का नहीं, दृष्टि का है
व्यक्ति का नहीं सष्टि का है
शब्द जैसे व्यक्ति की परीक्षा कर देखो
दो आंखें दो कान
दो नथने,
दो हाथ
दो पैर
इन युगों में ....
एक दष्टि, एक श्रवन ....
एक सांस, एक क्रिया ....
एक गमन,

11

फिर ....

लेकिन हज़ारों लोचन,

आलोचन

लाखों सांदन

हज़ारों करोडों ज्वालाएँ

एक सिर

एक हृदय

एक उदर

सब के लिए

एक ही एक मुंह

एक ही एक जिह्वा

हो तो शासक नहीं तो दाहक।

उस शब्द का क्या मतलब जो वाक्य में काम न आये

उस व्यक्ति से क्या मतलब

जिसमें राष्ट्रीय भाव न हो

परत रहे फिर भी अगर के दोनों या

देश संस्कृति में व्यक्ति में व्यक्ति के भाव सिमट कर न रहे तो कैसा।

इतिहास और त्याग की वेदी पर प्रकाश में

फहराती पताका

मात्र तीन रंगों का कपडा नहीं।

शब्दों और प्रणव नादों का ज्योत्स्ना पिण्ड है।

एकता में ही

शक्ति–अनुशक्ति और अंधकार से विमुक्ति है।

देश के सौभाग्य के लिए

रूपोदित हो जाओ
विहाग वीक्षण से
विहायस वीक्षण में जा आ जाओ
अपने घर से, अपने देश को
निहार लो ।

सिक्के के दो पहलु होने पर भी वह है एक ही
दोश के लिए तुम और पै दो हैं
फिर भी 'हम' कहने में ही एकता है ।
अच्छाईयों को सब में बांट दो
प्रणव को
पताका को
चाह को
प्रगति के किवारे पर पहुँचा जाओ ।



# తెలుగు పిలుపు !

[ 5–7–'85 న లాస్ ఏంజెలెస్ లో ఉత్తర అమెరికా ఐదవ తెలుగు సభల ప్రారంభోత్సవంలో చదివిన ప్రత్యేక కవిత ]

అమెరికాలో ఐదవ తెలుగు సభలు
తెలుగుదనానికి ఐదవతనం పత్రికలు!

కాలిఫోర్నియా బంగారు కంచంలో
కమ్మని ముచ్చట్ల తెలుగు పచ్చళ్లు –
ఈ లాస్ ఏంజెలెస్‌లో తెలుగు చూపుల
పలకరింపుల వెచ్చని కౌగిళ్లు!

కడుపు ఆకలితో మండి
ఆశయాల నీళ్ల స్వదేశపు చెరువులో ఎండి

ఖండాలు. సముద్రాలు దాటినా –
గుండె వీణియలు
నవ్య నాగరికతా తంత్రుల మీద
కలిమి పాటలు పాడుతున్నా
ఎక్కడో – ఎక్కడో లోలోపల
పేగు మాత్రం
'తెలుగు – తెలుగు' అంటూ
కలవరిస్తూనే వుంది !

అదీ జాతీయత !
అదీ సంస్కృతి !
అదీ – అవయవాలకీ
ఆలోచనలకీ అతీతమైన రక్త బంధం !

చెట్టు ఎన్ని అడుగులు
పైకెదుగుతూ పోయినా
దాని వేళ్లు మాత్రం
అది మొలకెత్తిన నేలలోనే !
బీజంగా పడినప్పుడు
ఆదరించిన నేలని
ఏ చెట్టు కాదంటుంది ?

ఓ ఉత్తరమెరికా
ఉజ్జ్వల వనసీమల్లారా !

మీ చరణాల ముద్రలు
తెలుగు తల్లి గుండెల మీద
ఇంకా చెరగిపోలేదు చూడండి !
మాతృ ప్రేమను చవిచూడండి !

మిమ్మల్ని పలకరించి
పులకరించటానికి వచ్చిన
ఈ తెలుగు గాలులతో కలిసి
హాయిగా పాడండి!

విమానం మీద వచ్చేటప్పుడు
ఏం తెలిసింది గనుక
విడమరచి చెప్పటానికి ?!?
అరేబియా, మధ్యధరా, అట్లాంటిక్ సముద్రాలో
గల్ఫ్, జర్మనీ, ఇంగ్లాండ్ దేశాలో
పర్వతాలో, నదులో, అరణ్యాలో
ఏవైనాగానీ — అన్నీ ఒకటే! ఒకటే!

తెలుగు నేల నుండి తెలుగు జ్వాలతు వాలాను
పిడికెడు అనుభూతిని తెలుగు నేల మీద
వెదజిమ్మాలని కోరాను!
మీ ఆలోచనల రత్నాల హారాలు
తెలుగు తల్లికి వేయండి!
మీ చెలిమి కలిమి వెలుగును
తెలుగు మేనికి గంధంలా పూయండి!
మీకోసం పుట్టింటి తలుపులు
ఎప్పుడూ తెరిచే వుంటాయి రండి!
ఈ డాలర్లు గాక,
రూపాయల్లాంటి తెలుగు పాపాయల్ని తెండి!
మా కనుపాపల అద్దంలో మీ ముఖాలు చూసుకోండి!
మీ ఎద పొరల్లో తెలుగుదనాన్ని దాచుకోండి!!



## జీవ శిల

తమాషాగా కళ్ళు మూసుకుని
నీ వెవ్వరిని ధ్యానిస్తున్నావో
ఎవరికి నమస్కరిస్తున్నావో
నేను గుర్తించలేకుండా వున్నాను.

తెలివితేటల పూలతోటల్ని నరికి
అందాల్ని పునాదులతో పెకలించి
ప్రేమానురాగాలు చీల్చి
ఆదరించిన వారి గుండెల్లో
కన్నీరు పొంగించి
పొలాల పచ్చదనాన్ని
మంటల్లో స్నానం చేయించి

బూడిద గుట్టల మీద
కీర్తి పతాకాన్నెగరవేసుకుంటూ
వినోదించే - నీ ధ్యాన
పరమార్థమేమిటో
నాకు తెలియటం లేదు !

రక్తాన్ని తీర్థంలా
ఆర్తిని ప్రసాదంలా
స్వీకరించే నీ భక్తిని చూసి
భయపడి -
అవతార పురుషులు, మహాత్ములు
ఎప్పుడో విగ్రహాలై పోయారు !

నేనే నీ కోసం
జీవ శిలగా మిగిలాను !!



# నెత్తుటి పైట

లావణ్య రేఖలతో
కారుణ్య సీమల నుండి వచ్చి
కవిత మీద పవ్వళించిన అందాన్ని
పరవశంతో
మట్టి
పలుకరిస్తోంది !

కన్నీటిలో నానిపోయిన మాటల్ని
కనకాంబరం పూలుగా
అర్పిస్తోంది - అర్చిస్తోంది !

బాధామయ గాథా
తాళవృంతం మీద
సముద్రాలు చిలకరించి
నిశ్శబ్ద దృక్కులతో వీస్తోంది !

కాలి. కరిగి, శక్తిలా ప్రవహిస్తున్న
కండల జ్వాలా ఖండాల మీదుగా
వీస్తున్న గాడ్పుల్ని
మానవతా ద్వారం వద్ద నిలిపి
శీతలత్వాన్ని ఊపిరిలో నింపుతోంది !

పరవశించిన ఆ మట్టిని చూస్తే
నాకెంతో భయంగా వుంది !
దాని భుజం మీద పైటలా
నెత్తుటి కొరడా వ్రేలాడుతూ వుంది !!



# గమనం

ఎవరది
నా మాటల్ని త్రొక్కుకుంటూ పోతున్నారు ?

నా కళ్ళల్లో కెందామరల్ని చూసి
కలకలా నవ్వుకుంటున్నారు ?

పంటలతో, ఫల రాశులతో
ఆకలికి సమాధి కట్టి —
ఆనందాన్ని బ్రతుకు నుదుట బొట్టు పెట్టి
నెత్తుటి చారికల
చరిత్ర ఖడ్గాన్ని
వెన్నెల్లో కడగాలని పరితపించిన
నా మీద ఎవ రిలా
బురద పులిమి పోతున్నారు ?

అగాధాల్లో పునాదులై పోయిన
అనాథ జన హృదయ ఆర్తగీతాన్ని
స్వరాలు విరిచి
అగ్ని సూక్తంలో ఆహుతి చేయాలని —
ఉక్కు పాదాల క్రింద పడబోయే
ఐక్య పేర్గుని
ఆత్మ విశ్వాస వీణకు తంత్రిగా మలిచి
అభ్యుదయ రాగం ఆలపించాలని -
ఆలోచనకు పదును పెట్టి
అడుగు ముందుకు వేసి నిలిచిన
నన్నెవ రిలా ముందుకు నెట్టి
వెనక్కు చూడకుండా పోతున్నారు ?

ఓ కాలమా ! ఓ లోకమా !
ఎవరది ? ఎవరది ? ఎవరు ?



# ఉదయరేఖ

మృత కళేబరాల మీద
రాబందుల విహారం చూసి
వెదురుటడవుల వాయువీచికల
వేణుగానం మూగబోయింది!

కసిగా స్వార్థాన్ని జల్లుకుంటూపోయే
నాగరికతను చూసి
పాలబుగ్గలమీద – స్త్రీల
పాల భాగంమీద
పచ్చ తోరణాలమీద
పరిమోద కారణాలమీద
విహరించే సంస్కృతి
నిర్ఘాంత వదనంతో
నిలిచిపోయింది!

ప్రతి కార్యం లోనూ
ప్రతీకార జ్వాలలతో
ప్రళయాలు ఆవృత్తమవుతున్నాయి !

పగిలిన విషపర్వతంలాంటి
మనిషికి —
మృత్యుస్పర్శతో విలపించే
కాలాన్ని గూర్చి ఏం తెలుస్తుంది ?

ఆ కళ్ళల్లో ఉదయరేఖ
ఎలా మెరుస్తుంది ?



# వికృతి వివేకం

మాతృ గర్భంలో
మాంసపు ముద్దలా వున్న నాలో
ఏ ఆకాశం తన ప్రాణాల్ని పిండి
ధారపోసిందో —
ఈనా డింత తేజస్సుతో మెరిసే
ఏ మెరుపులూ చెప్పడం లేదు !

ప్రథమంగా ఏ అక్షరం
అగ్నిలా జ్వలించి — నా
సర్వ శరీరంలో వాఙ్మయంగా
వ్యాపించిందో
ఏ ఆలయ మంత్ర ఘోషా
చెప్పడం లేదు !

ద్వేషం, తన చేతి ఖడ్గంతో తానే
ఖండ ఖండాలుగా ఖండించుకొని
మాటలుగా మారి
నన్ను తాకి, నా పదాన్ని
గాయం చేసిందో —
ఇప్పుడీ మలయ మారుతంలో
ఏ స్మృతీ చెప్పడం లేదు !

వికృతిని మింగి జీర్ణించుకున్న
పరికృతి — ఎంత పెద్ద పరీక్ష !
పరికృతిలోని వికృతిలో
ఎంత వెచ్చటి జ్యోత్స్న !!



# నదీగీతం

గొడ్డలితో నరికిపారేసి
వంటకట్టెలు చేసుకునేందుకు
దేశం -
ఎండిపోయిన చెట్టు కాదు !

గిరి శిఖరాన్ని - సముద్ర హృదయాన్ని కలిపే
నదీ వారధి !

నాగరికత మొలిచి, మొగ్గతొడిగి,
పుష్పించి, పరిమళించిన తీరాల మధ్య
దేశం - ఒక జీవ నది !

ఇక్కడా ?
ఆకలి మంటల చుట్టూ చేరి
ఆలోచనలు చలి కాచుకొనేది ?
ఇక్కడా ?
పచ్చిక మైదానాల్లో కలిసి
స్వార్థాలు కత్తులు దూసుకొనేది ?

పక్షికి కావల్సింది గూడుకాదు - రెక్క
మనిషికి కావల్సింది భ్రమకాదు - శ్రమ!

పిడికెడు మట్టిని పలకరించు
ప్రగతి గీతం పాడుతుంది!
కొండవై నిలిచి చూడు
దేశం నీ పాదాలముందు ఆడుతుంది!

కావల్సింది ఐకిట్టు - చేస్తాడు కాదు -
తాటాకులు మోస్తున్న
తాతలనాటి మాటల్ని తోడుకోటానికి,
సముద్ర హృదయం కావాలి!

సముద్రానివై - సర్వ ప్రవాహాల్ని
ఆహ్వానించు — ఆవాహనవై !

కిటికీలోంచి ఆకాశాన్ని చూడకు
ఈత రాకుండా నీళ్ళల్లోకి దూకకు !
కోరికల్ని అగ్గిపుల్లల్లా
ఎక్కడపడితే అక్కడ గియ్యకు !
సూర్యోదయ మవుతుంటే
గుండె తలుపులు ముయ్యకు !

మంచుగడ్డ మీద కూర్చోకు
మట్టి గడ్డ మీద కూర్చో !

దండలో దారం కనిపిస్తుందా ?
తీగలో విద్యుత్తు కనిపిస్తుందా ?
జాతి హృదయంలోని సంస్కృతి
ఎవరికైనా లేదనిపిస్తుందా ?

దేశం రాష్ట్ర దళాల పద్మం కాదు;
రాష్ట్రావయవాల హృదయం !

హృదయానిదే సమైక్యతా శక్తి !
కాబట్టి – ఉదరాన్ని చూసుకోకు
హృదయాన్ని చూడు !
పంజరాన్ని ఛేదించు !
రేపటి కన్న ఆసక్తితో పాడుకొనే
నవీగీతమై భాసించు !!



# ఆశా తమస్సు

ఆకాశంలో చీకటి
నిద్రపోతూ వుంది !

మనిషిలోని మత్సరంలో
అసత్యంలో — అన్యాయంలో
ఆత్మ వంచనలో - కృతఘ్నతలో
తన జీవాణువుల్ని దాచుకొని
ఆకాశంలో చీకటి
నిద్రపోతూ వుంది !

పేదరికం కాటేసిన
సీమాకాశంలో మిగిలేది
చీకటి నిద్రగాక యేమిటి ?!?

ఆశలాంటి సూర్యుడు
చీకటి కలలో ఒక కలవరింత
లేదా, కలవరింతలో
లేఉవ్వని కౌగిలింత !

చూపుని తూపులానాటి
ఆలోచిస్తే — ఏముంది ?
తలలన్నీ పాపపు గూళ్లు !
కళ్ళనిండా కల్మషపు సెలయేళ్లు !
మాటలకు ఎర్రెటి గాట్లు
మమతకు ఒంటినిండా తూట్లు

నాకిప్పుడు మలయమారుతాల్లో
పువ్వుల్లాంటి శిరస్సులొద్దు;
అగ్నిలో నడిచిపోయే
బలమైన చరణాలు కావాలి !
అవి, జీవ కిరణాలై రావాలి !
జాతి కేతనాలై లేవాలి !!



# విరామ యాత్ర

రోజులు మౌనంలో మునిగి
కరిగిపోతున్నాయి !
ఆలోచనలు శాంతికోసం రగిలి
ఇగిరి పోతున్నాయి !

రోజూ జనన మరణాలు
అనుభవించే సూర్య చంద్రులు
నక్షత్రాల నూకల కోసం వాలి
ఆకాశం వలలో చిక్కుకున్న
పక్షుల్లా ఉన్నారు !

పగలు – రేయి రెక్కల సవ్వడిలో
చివురించిన ఊపిరుల్లో
ఊయెల చిరు గంటల
ఊరావలి చితి మంటల – అలజడి !

అరణ్య వృక్షాలు
ఆరామ లతలు
ఆశీస్సులు చిలికితే
మౌనంగా శాంతి హృదయం పలికితే
క్షితిజ రేఖ మీద విశ్రమిస్తాను !
క్షితి నుండి హాయిగా నిష్క్రమిస్తాను !!



# అశ్వయానం

కామం రౌతుగా
మనసు మహాశ్వమై
పరుగెడుతూ ఉంది !

ఇరుకు దారులు దాటి
రాజ మార్గాలు దాటి
రహస్య పథాలు దాటి
సామ్రాజ్య సమరాలు చిమ్మిన
భస్మ రాసుల్ని దాటి
భూమి దాటి
చంద్రుణ్ణి దాటి
సూర్యాభిముఖంగా
పరుగెడుతూ ఉంది !

క్రౌర్యం, చౌర్యం
దర్పం, దౌర్జన్యం
పన్నిన వ్యూహాల్ని చీల్చుకుంటూ
స్వేచ్ఛా కిరణాల్ని పీల్చుకుంటూ
పరుగెడుతూ ఉంది !

పంటలు పచ్చ తివాసీలు
పరిచిన చోట
జీవితం ఒక జయధ్వజంగా
భాసించిన చోట
రవ్వంతసేపు ఆగుతూ ఉంది !

ఈ అశ్వయానం
నా విశ్వ గానం !!



# కీర్తి యవనిక

పాపం !
సన్మానాల బంగారు గొలుసుల్లో
ఆ కీర్తిమంతు డెంత నలిగిపోతున్నాడో !

అన్ని కాకుల్లో ఒక కోకిలలా
ఎంత ఒంటరివాడై పోతున్నాడో !

ఆ గుండెల్లో పొంగేది
ఆనందమో — ఆవేదనో ! పాపం !
ఇప్పుడతడు కుండ బోర్లించిన దీపం !

అతనికేం తెలుస్తుంది
అరణ్యాగ్ని విజృంభణ ?
అతనికెలా తెలుస్తుంది
దౌర్జన్యానికి రాలిన
ఆకులు చెప్పే ఆత్మకథ ?

ఏ దివ్య పరిభాత వాణి
అపార కృపారసాభిషేకంతో
వాడి నొసట యశస్తిలకం దిద్ది
పెద్ద జేసిందో —
ఆ పరిభాతానికి దూరమైన
వాడి కళ్ళు వాకిళ్ళలో
ముగ్ధ మోహన గౌరిమసుమాలు
దోసిట తెచ్చిన నే నెలా
నిలువ గలనో తెలియటం లేదు !
కీర్తి యవనిక తొలగటం లేదు !!



# అమృత నేత్రాలు

అగ్ని మార్గాల్లో నడుస్తూ
నదిలా సేవ చేస్తున్నాను !

బాధాచక్ర పరిభ్రమణంలో
నిలబడి నిర్విరామ
శాంతి నిష్ఠలో ఉన్నాను !

అనుక్షణం భయం
ఆరని మృత్యువు
కరాళ హస్తాలు చాచి వేధిస్తున్నా
సహనంలో హృదయాన్ని దాచుకొని
ధైర్యంగా గగనాంతరాళంలోనికి
చొచ్చుకొని పోతున్నాను !

సంకల్పం సానదేరి
చూపు విజ్ఞాన ప్రచండ కిరణమై
ప్రకృతి దివ్యాభరణమై
దేవతలు వీరతాండవం చేసే వేళ —
ధ్వనితో గుచ్చుకొన్న హింసను
బలంగా బయటికి లాగి
ఈ మట్టి కుండలో రక్తాన్ని
నిర్మలం చేస్తున్నాను !

ఈ అమృత నేత్రాలతో
నీ కళ్ళలో
విష పాత్రలు చూస్తున్నాను !



# స్వరూప దర్శనం

ఈ భూమ్మీద
మానవుడొక ప్రశ్నగా నిలిచి
చూస్తున్నాడు !
సమాధానం చెప్పలేక
సూర్యుడు పడమటి సంద్రంలో
మునకలేస్తున్నాడు !

తరాలుగా, యుగాలుగా
కాలం తరగలెత్తి
నిశ్శబ్దాన్ని తాకి
శబ్దంతో లయిస్తూ వుంది

మాటల్లో ఏ పువ్వుల
సవ్వడులూ లేవు
చూపుల్లో ఏ వసం
తోదయాలూ లేవు !

మానస ద్వారం
తెరిచి చూస్తే — ఏముంది ?!?

ప్రశ్నల సుడిగాలులు !
స్మృతుల తుఫానులు !
కరగని చీకటి ?
కావల్సినంత భీభత్సం !!



# మృత్యుకాంతి

మృత్యువు మెచ్చుకోవాలనే
ముస్తాబవుతున్నాను
మనసులో పడే సం'దేహాల' ముడుల్ని
మాటలతో విప్పుకుంటున్నాను !

జీవితపు పంజరంలో చిక్కిన
స్వేచ్ఛా విహంగ పక్ష విక్షేపాల్ని
స్వరాల్లో, రేఖల్లో, శిలల్లో, మువ్వల్లో దాచి
ఆ లలిత పరికంపనాలకు స్పందిస్తున్నాను !

మతాల్ని పాఠ్యాంశాల్లా చదువుకొంటూ
ఆదర్శాల్ని అందుకొనే జీతంలో చూచుకొంటూ
నేత్ర గవాక్షాల్ని తెరిచి
నిఖిల గగనాన్ని చుంబిస్తున్నాను !

కాలిపోతున్న కాగితంమీది
కవితలాంటి కాలాన్ని ఆస్వాదిస్తూ
ఈ చీకటి సీమకు
దివ్య తేజస్సుతో తరలి వస్తున్న
మృత్యుసుందరిని దర్శిస్తున్నాను
ఆహ్వానిస్తున్నాను !

ఆరిపోయిన దేహాణువులనుండి
అగ్ని వృక్షం అంకురిస్తుందని నమ్ముతూ
తుది శ్వాస వరకు
అభయాన్ని పరిచి
మృత్యువుని నడిపిస్తున్నాను !

మృత్యువు మెచ్చుకొన్నదే ఇతిహాసం !
నొచ్చుకొన్నదే పరిహాసం !



# పరివర్తన

ఆదరణ లేకున్నా
ఆచరణకై నిలిచిన చరణాల్ని
కువిమర్శల విషపు పురుగులు కొట్టేసి
వెకిలి నవ్వులు, వెక్కిరింతలు
మనసుని అగాధాల్లోకి నెట్టేసి
నిస్సహాయంగా నిలచిన నామీద
ప్రచండ మర్తాండ కిరణ వర్షం కురిసి
భగ్గున తపిసి
ఒక రోహిణీ దివస సాయం సంధ్యలో
వడగాడ్పు టలల్లో
నా నిట్టూర్పులు కలిపి
ఒరిగిపోయాను!

కాలంలో కరిగిపోయాను!

ఆశ్రియం లేని కోయిల
నా గుండెల నిశ్శబ్ద వేదనలా
ఎక్కడో కూస్తూ ఉంది!

నాకోసం ఒక గొడ్డలి
కలుకు చేతుల్లో మెరిస్తూ ఉంది!

ఏం చేస్తాను ?!?
వసంతాల్ని ఆదర్శాల్లో దాచుకొని
గ్రీష్మాలకే తలుపు తీస్తాను!
పుట్టుకని కట్టెలుగా మార్చుని
అగ్నిలో అగ్నిలా రగులుతాను!

కొత్త విత్తనం కోసం
పిడికెడు మట్టినై మిగులుతాను!!



# క్షమాపాత్ర

క్షమించు
ఇది నా అశక్తత !

కామం రగులుతున్న ఆ కళ్ళకు
ప్రేమపాత్ర అందుతుందని ఎలా అనుకుంటాను ?

కాలనాగులు బుసలుకొడుతున్న
ఆ నవ్వులకు
స్నేహ పాత్ర అందుతుందని ఎలా అనుకుంటాను ?

ముళ్ళు వికసించిన
ఆ మాటలకు
ఆదరపాత్ర అందుతుందని ఎలా అనుకుంటాను ?

శూన్యం ఆభరణమైన ఆ హస్తాలకు
సత్ఫల పాత్రి అందుతుందని ఎలా అనుకుంటాను ?

సోమరితనం సంకెలలో ఒరుసుకొనే ఆ వ్యూహాకు
సుమపాత్రి అందుతుందని ఎలా అనుకుంటాను ?

ఆ విషపాత్రి నిజంగా
మధుపాత్రి అవుతుందని ఎలా అనుకుంటాను ?

అందుకే —
నీ కళ్ళల్లోని ఆ క్షమాపాత్రిని
అడుగుతున్నాను
నాకు దానం చెయ్యి !

నేను దోషాల్ని పానంచేస్తాను !
నీ కోరిక తీరుస్తాను
ఒక నిశ్శబ్ద తీరాన్నై నిలుస్తాను !!



# ఆనంద ధుని

స్వార్థ నేత్రాలతో
బలహీనుల రక్తాన్ని పిండుకొని సేవించి
తృప్తిగా నవ్వుకొనే
ఆ నికృష్ట ధన మదాంధుని కేం తెలుస్తుంది తల్లీ
నీ అపార కృపా రసం విలువ ?

నిశ్చల నయనాలతో
నిర్మల హృదయంతో
మానవానీక మహోద్ధరణ కోసం
నేను అడుగు వేసినప్పుడు —

నిర్వికార భావ సమాధిలో
దివ్య జ్యోతులుగా మారిన
శాంత మూర్తుల చరణ పద్మాలు కడిగి,
ఆ పావనోదక బిందువులతో
విరాజిల్లే నా శిరస్సుని చూచినప్పుడు —

బుక్కుల గాన యజ్ఞంలో
పరిభవించిన పారవశ్య పీయూషాన్ని పులుముకొని
విజయ తాండవం చేస్తున్న
నా అంతరంగాన్ని స్పృశించినప్పుడు —

నీ వెంత పులకించి పోయావో
నాకు తెలుసు తల్లీ !
నాకు తెలుసు !

అహోరాత్రులు నీ పరిష్వంగం కోసం
పరితపించే యీ పేద గుండె
నీ కే మీయ గలదు !
ఆనంద ధునీ !
సద్గుణ ఖనీ !
నా జననీ !
పావనీ !
జనావనీ !
అవనీ !



# ప్రాణచర్య

కనుబొమలు ముడిచి
కళ్ళతో క్రౌర్యాన్ని క్రక్కుతూ
బోధివృక్ష శాఖా ఛాయల్ని
ఆలోచనా పథాల మీద పడిన
ఎర్రటి శిలువ నీడల్ని
సోక్రటీస్ ఖాళీ చేసిన
నల్ల నవ్వుల విష పాత్రని
దాటి వచ్చి —
నా విజ్ఞాన జ్యోత్స్నా సౌరభ
సామ్రాజ్యం తెచ్చి
మృత్యు మంత్రాన్ని ఉచ్చరిస్తూ —

నా గుండెకు
అణ్వాస్త్రాన్ని గురిపెట్టి నిలిచిన
ఓ అగ్రజుడా !
"సంధించిన అస్త్రాన్ని విడువకు"
అని నేనంటే —
సమరంలో నువ్వొక గిరి శిఖరం !
"రా ! విడు !" అన్నానా
చరిత్రలో నేనో మేరు నగం !!

— * —

# జీవన స్వరం

రగిలి రగిలి
అసూయామయ హృదయాలు
నలుగురు నడిచే దారుల్లో
పేలినంత మాత్రాన -

వసంత మాధుర్యం ఎండిపోయి
కనుచూపు మేర దూరంలో
కోకిల కరిగిపోయినంత మాత్రాన -

అరుణ మనోజ్ఞ యుగళ సంధ్యా కృతికి
మసక చీకటి అంటి
మలిన మైనంత మాత్రాన -

ఎవరు నీనుండి నన్ను
విడదీసేది ?

వెలుగువై, వెన్నెలవై
నీవున్నప్పుడు
నీడలా నిలిచి నే నెంతగా నిన్ను చూశానో,
మైమరచిపోయానో
నీకు తెలియదా ?

జనన - మరణాల మధ్య
మృత్యు రేఖలా మనం లేమా ?

బోసి నవ్వుల నుండి
బోసి నవ్వుల వరకు
మనం ఒకటి కాదా ?

ఓ జీవన స్వరమా !
మనం ఒక్కటి కాదా !?!



# ఆవేశం

వర్షాలకు పొంగిపోయి
మండు టెండలకు కృంగిపోయే
సామాన్య నది లాంటి
జన ప్రవాహాన్ని
నిర్వికార నేత్రంతో చూస్తున్నాను !

ఉభయ తీరాల
ఇసుక తిన్నెల్లో
దురదృష్టాల్ని అంచనా వేస్తున్నాను !

గట్లమీద ఎన్నెన్ని చెట్లు !
ఆవలి పొలాల గుండెల్లో
ఎన్నెన్ని ప్రాణ వాయువులు !

ఒక తీరాన —
సుఖాలు తేలియాడే
నాగరికతా మహోద్ధతి -
వేరొక తీరాన -
కష్ట జీవన సౌందర్య మందస్మితంతో
గ్రామీణ వినమ్ర పద్ధతి -
నవీన - పురాణ
తరంగాలతో - జన ప్రవాహం !

ఒక నర్తకిలా
ఒక గాయనిలా
ఒక నిశ్శబ్ద శబ్ద జీవన కావ్యంలా
జన ప్రవాహం !

ఈ ప్రవాహాన్ని చూస్తుంటే -
నీకేమో గానీ -
దీన్ని దాటాలని నా కెంత
ఆవేశంగా ఉంది !?!



# శిథిల వృత్తి

నవ్వులు పరిమళించే
భోగాలు కోసుకొని
సీడలో కూర్చుని
దండ కట్టుకుంటున్నాను !

నేను అడుగు పెట్టిన
తోటకు ఆవల -
అదే పనిగా
ఆకలి దప్పులు
అరుస్తున్నాయి !

నాకేం ? అరవనీ !
వెన్నెల్లో తడిసిన నా
ఆలోచనల్ని నేను
గుడి గంటల మీద
ఆరేసుకొంటున్నాను !

ఈ శిథిల మానవ మందిరాన్ని
ఏలుతున్న చీకటి
నన్నేం చేయగలదు ?

నేను నా చూపుల్ని
నిశ్చల దీప కళికల్లా చేసుకొంటున్నాను !
హాయిని నా ఇంద్రియాలకు
గంధంలా పూసుకొంటున్నాను !
నాలో తుషార ధారలు తప్ప
ప్రచండాగ్ని వీచికలు లేవు !-
ఔను లేవు !

అయినా ఇదేమిటి !?!
నా చేతిలో దండ
వాడిపోయింది !
ఏం జరిగింది ?!?



# కాంతి యాత్ర

మేధావిలా ఆకాశం
మెరుస్తూ వుంది!

రణ భూమిలో
మృత వీరుని
సింహ గర్జనల్ని
మేఘం ప్రకటిస్తూ వుంది!

ఆత్మీయ వ్యక్తి
అకాల మరణాన్ని
భయ విహ్వల నాదంతో
పిడుగు ప్రదర్శిస్తూ వుంది!

మహనీయుల
విజ్ఞాన ఖచిత కరుణలా
వర్షం కురుస్తూ వుంది !

భూమి మీద
పాయలు పాయలై
బిరుకుటాశ పారుతూ వుంది !

విశ్రాంతి లేదు
ఎక్కడా ఆగి ప్రయోజనం లేదు
ఈ ఝురులు — ఆ గిరులు దాటి
ఆ చైతన్య ద్వారాన్ని చేరుకోవాలి !

ఆవరించిన మహాంధకారంలోకి
నా యాత్ర సాగించాలని
పరిపూర్ణ విశ్వాసంతో
సంకల్పిస్తున్నాను !
ఎవ్వరూ ప్రశ్నించకండి !!



# అగ్ని ధనుస్సు

వక్రించిన కాలం
వికటంగా నవ్వుతోంది !

ఆలోచనల్లో అరణ్యాలు విచ్చుకొని
మార్గాలు చెరిగిపోతున్నాయి !

భయంకరంగా గర్జిస్తూ భయం
దేహాణువుల మీద
ధారాపాతంగా కురుస్తోంది !

రెక్కలు తొడుక్కొని రహస్యాలు
ఎక్కడికో ఎగిరిపోతున్నాయి !

ఆకాశం నుండి తటాలున దిగి ఆశ్చర్యం
చూపు మీద అడుగు పెడుతోంది !

నక్ర దంష్ట్రల మీద క్రౌర్యం
నగ్నంగా నర్తిస్తోంది !

జీవితం రాల్చిన కన్నీటి చుక్కలో
గర్వం ప్రతిబింబిస్తోంది !

ఎటు తిరిగినా
స్వార్థపు సుడిగుండాలు —
ఆకలి జెండాలు !

ఎక్కడ చూసినా
నైచ్యంలో మొలకెత్తుతున్న శిరస్సులు —
గాఢతమస్సులు !

అందుకే —
ఉక్కు పాదాలతో
మనస్సుని కల్లోల పరుస్తున్న
క్రూర మృగాల్ని రూపుమాపాలని
వేటగాణ్ణి అవుతున్నాను —
అగ్ని ధనుస్సు నందుకొంటున్నాను !!

— * —

# ఎడారి వెన్నెల

ఖడ్గ యుగాలకు
దాహం తీరింది!
నర చరిత్ర మసి బారింది!

అధర్మ పరుల
అన్యాయ ప్రియత్వం సాధించిన
ఎడారి రాజ్యాల
ఇసుక దారుల్లో పయనించే
నాగరికత పాదాల క్రిందపడి
నవ మల్లిక వంటి సంస్కృతి
రెక్కలు విరిగి నలిగింది!

అయినా –
గగనానికి
ఆశను జెండాగా ఎత్తిపట్టి
ఆశయాన్ని పాడుకుంటూ
అడుగులు వేస్తున్నాను

వీర రక్తంతో వంతెనలు కట్టి
జాతిని, జాతీయతను
వెలుగు తీరానికి దాటించాలని చూస్తున్నాను !

భృకుటిలో పరాభవం
బద్ధలై – ప్రవహిస్తున్నా
భయం వీస్తున్నా –
మసిని తుడిచే మగటిమితో
అసత్యం మీది నుండి తీసి
సత్యం మీద నా అడుగు మోపుతున్నాను –

చరిత్ర – సంస్కృతి నా కింక
సూర్య చంద్రులు !!



# అవ్యక్త యాత్ర

భూమి మీద నేను పడినప్పుడే
కాలం తెగి పడింది !

ముత్యాల్లా రాలి
రోజులు దొర్లిపోయాయి !
నవ్యతలో వేర్రిళ్ళ కొనలు ముంచి
ముత్యాలేరి
మళ్ళీ కాల హారాన్ని కట్టి
ఒక రసాత్మక జీవన వాక్యం మెడలో
వేయాలని ప్రయత్నిస్తున్నాను !

కానీ రాలిన ముత్యాలన్నీ
అందటం లేదు -
అగాధ రహస్యాంధ సీమల్లోకి
జారి పోయాయి !

ఆత్మలో ఎంత మధనం జరుగుతున్నా
అమృతోదయం కావటం లేదు !
సూత్రం చాలటం లేదు
యత్నం చాలటం లేదు !

కళ్ళల్లోకి పొంగిన రక్తంతో
ముత్యాలు పగడాల్లా భాసిస్తూ
అరచేతిలో సంధ్యారాగా లాలపిస్తున్నాయి !

ఒక అవ్యక్త భిక్షాపాత్ర
మనసులో కదులుతోంది !
ఒక అదృశ్య హస్త సంజ్ఞ
ఆవలి తీరంలో మెరుస్తోంది !!



# సిగ్గు తెర

ఆకులు రాలిపోయాయి !
హిమ బిందువులు
కరిగి పోయాయి !

నిష్కామ కర్మయోగి ఆత్మలా ఆకాశం
నిర్మలంగా ఉంది !

నీల నీరద శకలాలు
విడిది చేసిన గిరి శిఖరాల నుండి
నీలి వెన్నెల కురిసే
నీలవేణి నేత్రాంచలాల వరకు -
సహస్ర ఫణాలతో
విరిసిన సౌందర్యం
నా హృదయ సన్నిధిలో
బుసలు కొడుతూ ఉంది !

శబ్దాన్ని దాటి నా మనసు
విశ్రాంతి తీసుకొంటూ ఉంది !

పరిమళ పుష్ప పాత్రికల్లో
నన్ను నేను నీకు
అర్పించుకోవలసింది పోయి
నీ ప్రేమను దోచుకోవాలనీ
నిన్ను నాలోనే దాచుకోవాలనీ
ఆశించి నందుకు
ఆలోచించినందుకు
సిగ్గు పడుతున్నాను !

ఈ బుసల మధ్య ఒంటరిగా
నలిగి పోతున్నాను !!



# సుగంధ సింధువు

ఇన్నాళ్ళకి
అమృతం నా భావం మీద
కురిసింది !

ఇన్నేళ్ళకి –
అందం నా హృదయం మీద
విరిసింది !

నీడల్ని తొలగించుకుంటూ
భయాల్ని విదిలించుకుంటూ
విషాదాల్ని దాటుకుంటూ
వినోదాల్ని మీటుకుంటూ
అంతరాత్మలో
శాంతి బీజాలు నాటుకుంటూ
నడుస్తున్నాను !

ఈ రాత్రి గడిస్తే
ఇదే పవనంలో
నా కోక జ్ఞాన బోధ
వినిపించవచ్చు !

ఈ ప్రేమ పాత్ర
అవ్యక్త మధురానంద
ధారలతో నిండవచ్చు !

ఉషః కిరణ స్పర్శతో
ఈ బిందు వాక
సుగంధ సింధువు కావచ్చు !



# కెందామర

వసంతం వాలిన
దృశ్యాన్ని చూస్తూ
ఒంటరిగా నిలబడితే
ఎన్నో ఆలోచనలు !

ఒకే రకం కెరటాల్లాంటి రోజుల మధ్య
ద్వంద్వాల మధ్య
కలయికకు
ఎడబాటుకు
తేడా లేదు !

జీవితం స్వప్నం కాదు; అగ్ని !
నిరంతర కష్ట జ్వాలలనుండి చూస్తే
రక్తాక్షర కాసార తరంగాల్లో వికసించిన
కెందామర పుష్పం నా మనసు !

మేధస్సులో అవ్యక్తంగా మెరుస్తున్న
భయంకర జ్ఞాన సౌందర్యం కోసం
ఎన్నెన్ని మృత్యు దీపాల్ని
కళ్ళతో కౌగిలించుకున్నానో !

ఈ వేళ నా మీద
ఒక సత్యం
వసంతంలా వాలింది;
అమృత సిద్ధిని చూపిస్తూ !



# భావ స్వర్గం

నీకు నా బ్రతుకు దారి వంకర
నేనో వ్యర్థ జీవిని !

నా కళ్ళల్లో ఉన్నది శూన్యం
నా మాటల్లో వున్నది దైన్యం !

ఏ ప్రేరణకీ చిరునవ్వు మొలవని
పాషాణ క్షేత్రం
నా హృదయం !

అవునా !

కానీ — నామీద
నువ్వు విసిరిన వలల్ని
దగ్గరకు లాక్కొని నన్ను చూడు !

నే నొక కిరణ మార్గాన్ని !
మానవతా భావ స్వర్గాన్ని !!

# సొగసు నిట్టూర్పు

ఈ శరీరంలో
జవసత్వా లున్నప్పుడు
ఎండలు విరి దండలు !
వానలు హాయి వెన్నెల సోనలు !
చలి చెలి కౌగిలి !

ఆ జవసత్వా లుడిగినప్పుడు
లే యెండలు మంటల తుఫానులు !
చిరు జల్లులు ఉప్పెనలు !
చలి మీద పడిన పులి !

చూస్తుండగానే ఎంత మార్పు !
సొగసు కెంత నిట్టూర్పు !?!

# తెలుగు తేనె!

హిమాలయ శిలా శాఖకి పట్టిన
తేనెపట్టు నా దేశం వెలుగు
నా దేశం తేనెపట్టుని పిండితే వచ్చే
తేనె ధార నా తెలుగు !

క్షీర సాగర తీరాన
దేవాసురులకు అమృతాన్ని పంచే
మోహినీ నయన తారల
విలాసాల జిలుగు - నా తెలుగు !

నింగి తోటలో
చుక్కల కనురెప్పల్లో
తళుక్కున ఊగే
తలపుల చిలిపి మెఱుగు - నా తెలుగు !

తరాలపై - హృదయాంతరాలపై
వరాల స్వరాలపై - రాగాల సరాలపై
వెన్నెల వాన కురిపించే
శుక్ల — కృష్ణ పక్షాల
జాబిల్లి కోయిల పులుగు — నా తెలుగు !

గుచ్చుకొన్న మన్మథ బాణంతో
చిచ్చుఅ కంటివాని శిలాహృదయంలో పొంగిన
శృంగార భావాంచలాన పరిమళించే
పురాణాల పునుగు — నా తెనుగు !

భారతమో, ప్రఫుల్ల రస పద్మమొ, తెల్గుల కొగ్రివ్వెలుంగు కా
సారమునందు కావ్యమయి సన్నుతికెక్కె, మదాః రీతి ఈ
భారత దేశమే పలుకువారక తత్సమ గంధ మాధురీ
ధారల తూలిపోయె - కవితా మయ మయ్యె సహస్ర వర్షముల్ !

ఆదికావ్యము మొదలు
ఆధునిక కవనాల
తీరాల వరకు గల
తెలుగుదన మెన్నగా —
శక్యమే ? సాధ్యమే !

నాల్గు మోములకైన
వేయి పడగలకైన
కలహంస గమనాల
కలికి వరములకైన -
శక్యమే ! సాధ్యమే !

అర్థసూక్తికి నిధియ
ఆదికవి నన్నయ్య !
తేట మాటల నిధియ
తిక్కన్న ధీ నిధియ !

నాసటి కన్నును దాచి
పసగల్గు వర్ణనల
కైలాస శిఖరాల
కవితా రసాలాల
సంచరించిన శంభుఁ
డా శంభుదాసుండ !

తేనె పల్కుల నురికి
పల్కు పల్కును కొరికి
జాను తెల్గుల పంట
పండించె పాల్కురికి –
కావ్య కన్యల ఎదల
రాచిల్క పాల్కురికి –

పలుకు చెలి కన్నీటి
చుక్కలను తను త్రాగి
మక్కువలు చిమ్మ ఆ
మందహాసాలన్ని
భాగవత సీమలో
విరియించె మా అన్న
తలపు జన్నుల మిన్న
రైతన్న పోతన్న !

అటు చందనపు పూత
లిటు భస్మరాగాలు !
అటు రుద్రమాలికలు
ఇటు రత్న డోలికలు !
అటు శైవ వేదోక్తి
ఇటు భామినీ రక్తి !

శృంగార నైషధం
పల్నాటి భారతం
మార్గ — దేశీ మార్గం
మార్గదర్శక శక్తి —

సాధించె నెవ్వాడు
సరస సద్గుణ వర్తి
అతడు శ్రీనాథుండు
కవిలోక యోధుండు !

కనకాభిషేకాల
కవిరాజు శ్రీనాథ
కవితాభరి గర్జనల
మార్మోగి మార్మోగి
దిక్కు దిక్కుల సాగి
రస వీణలను తూగి
మంత్రి ముగ్ధము చేసి
చెలరేగి — చెలరేగి —
'పద' కింకిణీ 'ధ్వనుల'
ఘల్లు ఘల్లులు దూసి
కడగంటి చూపులను
నుడులు రాశిగ పోసి —

పెద్దన్న పాదాన గండపెండేరమై
తిమ్మన్న లేఖినీ సుమ పారిజాతమై
కృష్ణరాయల హృదయ వాటిలో దొరికిన
కవితా తటిద్వల్లి ఆముక్తమాల్యదై —

స్వర్ణయుగ ఛత్రాన
వర్ణ మధుగాత్రాన
ఏ వెలుగు నిలిచెనో
ఏ వెలుగు పిలిచెనో
ఆ వెలుగు - నా తెలుగు !

గురజాడ గొంతులో పలికింది నా తెలుగు
రాయప్రోలును మీటి పిలిచింది నా తెలుగు
విశ్వనాథను కుదిపి - శ్రీశ్రీని కదిపి —

నానా సముద్భూస
భావనా లోకాలు
పావనం చేయగా
ప్రవహించె నా తెలుగు !

నా తెలుగు నాది
ఇది మధురిమకు పునాది !

నవ రసాల శబ్ద ధనుస్సు నా తెలుగు
నవ యుగాల కాంతి సరస్సు నా తెలుగు !

వేదానికి భాష్యం నా తెలుగు
నాదానికి భాష నా తెలుగు !

ఈ దేశం భాషా సతికి
నొసటి తిలకం నా తెలుగు
సంస్కృతి — సభ్యతలకు
చరిత్ర వనంలో వేసిన
శాసన ఫలకం నా తెలుగు !

నా తెలుగు నాది
ఇది మానవత్వానికి పునాది !

తెలుగు తేనె వుంటే -
స్వర్గాలెందుకు ? దుర్గాలెందుకు ?
తెలుగు పలుకు వింటే -
పదవులెందుకు ? మదవతుల
పెదవులెందుకు ?

ఆత్మశక్తి నా తెలుగు
అమృత కీర్తి నా తెలుగు
ఈ దీప్తిని నిలుపుకో !
ఈ కీర్తిని పులుముకో !

——

# ఆచార్య తిరుమల

ప్రచురిత

## రచనలు

1. యమునాతటి (పద్యకావ్యం) 1967
2. రాళ్ళు గాజులు (కథాసంపుటి) 1968
3. చక్రార పంక్తిరివ (పద్యకావ్యం) 1971
4. స్వర వల్లరి (లలితగీత సంపుటి) 1975
5. మరీచిక (సాంఘిక నాటిక) 1979
6. మాట్లాడే మల్లెలు (కవితా సంపుటి) 1979
7. పల్లవి (లలితగీత సంపుటి) 1980
8. స్వేచ్ఛాభారతి (సంగీత రూపకం) 1980
9. తెలుగు తెమ్మెరలు (వ్యాస సంపుటి) 1981
10. శ్రీరామనామసుధ (శతకం) 1982

11. హృదయ భారతి
(1983 లో దేవులపల్లి కృష్ణశాస్త్రి అవార్డు పొందిన పద్యకావ్యం)
12. చీకటి మెరుపులు (కవితాసంపుటి) 1982
13. విద్యుల్లత (మినీ కవితాసంపుటి) 1983
14. పితృ స్మరణ (స్మృతి కావ్యం) 1983
15. శిలల పొదలు (కవితా సంపుటి) 1984
16. కవితా కళ (విమర్శనాత్మక సాహిత్య గ్రంథం) 1984
17. వచన భగవద్గీత 1984
18. స్వప్న వీణ (గేయసంపుటి) 1985
19. The Heaven of Tears 1988
(ఆచార్య తిరుమల కవితకు ఆంగ్లానువాద కావ్యం)
20. అక్షరాగ్ని (కవితా సంపుటి) 1985
(జ్యోతిర్మయి అవార్డు పొందిన కావ్యం)
21. కవి దర్శనం (వ్యాస సంపుటి) 1986
22. అమృత నేత్రాలు (కవితాసంపుటి) 1987

అచ్చులో :

సాహితీ పథం (విమర్శనాత్మక గ్రంథం)
అమృతాగ్ని (పద్యకావ్యం)
కర్పూర బాష్పాలు (పద్యకావ్యం)





ఆధునికాంధ్ర వాఙ్మయారామంలో సర్వత్రా ఇప్పుడు వీస్తున్నవి 'తిరుమల'య పవనాలు, అవే ఆచార్య తిరుమల కలం వీవనలు.

**ఆచార్య తిరుమల—**

పద్యం, గేయం, వచనం— దేన్ని స్పృశించినా సమున్నత ప్రభా బంధురం చేయగల స్పర్శవేది;

కవిత, సాహిత్య విమర్శ, నాటిక, కథానిక, అలంకారశాస్త్రం— చేపట్టిన ప్రతి ప్రక్రియలోను నవ్యతను ప్రదర్శించి, పరిపక్వతను నిరూపించి జిజ్ఞాసువులకు, రసపిపాసులకు పరమావధిని నిర్దేశించిన సాహితీ సహస్రారుడు:

జాతీయకవిగా ఢిల్లీనుండి భారతీయ ఉల్లాన్ని పల్లవింపజేసిన సాహితీ వసంతుడు;

'యమునాతటి' నుండి 'అమృతనేత్రాల'దాకా సాగిన సాహితీప్రస్థానంలో ఎన్నెన్ని విజయాలు, పురస్కారాలు, కవికౌస్తుభ, మధురభారతి, సాహితీ స్వరాట్ వంటి ఎన్నెన్ని బిరుదులు, విదేశపర్యటనలు, మరెన్నెన్ని.... ఇంకెన్నెన్నెన్నో !....

ఈ 'అమృతనేత్రాలు'లో ప్రతి అక్షరం ఒక జాబిలి మొలక, ప్రతి భావం ఒక వెన్నెల తునక.

ఆనందస్నానం చేయండి, అమృతపానం చేయండి.

—వై. రామకృష్ణారావు